సిగ్గుగా వుంది. అయితే, యిది వార్షికంగా భావించి, యేటా వ్రేకమాటు, ఇలాగే వుదయం పూజచేసుకుని యివతలికి వచ్చేటప్పటికి దర్శనం దయచేయిస్తూవుండండి"

"అమ్మా, ఆనందపారవశ్యం కలుగుతోంది. మాటలు రావడం లేదు. నీయోగ్యత విన్నాను. విన్నంతా నిదర్శనం కనబడుతోంది. చాలా సంతోషం. అయితే, నువ్వొక్క సంగతి ఆలించాలి. నేను నీదగ్గిరికి డబ్బుకోసం రాలేదు. కనక, ముందు, యీహూపాయలు నీదగ్గిర వుంచు......"

"........తమదగ్గిరే వుంచి తమరే వినియోగించండి. ఇచ్చేసింది మరి నేను పుచ్చుకోను. ఇక నావల్ల తీరవలసిన ప్రయోజనం యేమిటో సెలవిప్పించండి"

"చెప్పమంటానా? "

"సందేహం యెందుకూ? "

"సందేహమే లేదు, చాలా ఆశపడి వచ్చాను"

"కానివ్వండి, చెయ్యతగిందీ, చెయ్యగలిగిందీ అయితే నేను కాదనను"

"అనుగ్రహం వచ్చిందంటే నువ్వు మనుష్ల్ని యెల్ల కాలమూ పోషించేస్తావు. అంచేతే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను"

"సరే"

"వేశ్యావాటికలో అడుగు పెట్టడానికి నాకిదే మొదలు. సగం చచ్చి వచ్చాను; కాని నీయోగ్యత చూడగా సిగ్గుపడవలసిన ఆవశ్యకం యెంతమాత్రమూ కనపడదు"

"తమ కోరిక సెలవిప్పించండి"

"చేస్తా నని నువ్వు ముందు వాగ్దానం చేస్తేగాని నేను చెప్పలేను"

"అలాగ నే నెప్పుడూ వాగ్దానం చెయ్యను. వేశ్యల ద్వారా నెరవేరే రాచకార్యా లేమీ వుండవు. ఉన్నా మనవి చేశాను కానూ? ఆపనేమిటో ముందు తెలవాలి"

"......అలా అన్నావా?......అయితే విను. నాకు ఆరుగురు కూతుళ్లు. ముగ్గురు కాపరాలు చేసుకుంటు న్నారు. ముగ్గురూ బిడ్డల తల్లులు. పెద్దకూతురు మనమ లనే యెత్తింది. ఇంకా యిద్దరు ఆడపిల్లలికి పెళ్లిళ్లు చెయ్యాలి. ప్రస్తుతం నాలుగో అమ్మాయికి కార్యం చెయ్యాలి. ఇదిలా వుండగా; నాకొక్కడే కొడుకు. ఆకొడుక్కి మూడు మాసాల కూతురు——"

"తమ కుటుంబం, పొద్దుటి పూట లేవగానే చూసే వాళ్ళ పాపాలు పోగొడుతుందండీ"

"నీకలా తోచడం నా అదృష్టమే. మరి ప్రకృతం.

ఆకొడుకుని కష్టపడి యె. ఫ్ఫే. చదివించాను. అదేదీ అదీ?......యల్టీ—అది కూడా అయిపోయింది. ఉద్యోగం—అంటే యిప్పుడు మేష్టరీకోసం తిప్పలు పడు తున్నాను”

“.........అలాగా? ”

“అది నువ్వు శిఫారసు చేస్తే—”

“నేనా? ”

“అవును తల్లీ! అలాగే తెలిసిందమ్మా! ఈ పుణ్యం కట్టుకోవూ? ”

“ఇదేదో అగ్నిహోత్రప్పంత లా కనపడుతోంది. ఇదేదో కుట్రగా తోస్తోంది. అయినా అది యిచ్చేవా రెవరూ? ”

“జిల్లాబోర్డు—”

“ఆ! ”

“ప్రెసిడెంటుగారుట”

“......................”

“ఏంతల్లీ? ఏం మామ్మా? ఏమిటో వ్రణెకిపోతు న్నట్టు కనపడుతున్నా వేమిటమ్మా? ముచ్చెమటలూ పోస్తున్నట్టున్నా కనపడుతోం దేంతల్లీ? ”

“...................”

"మాట్టాడ వేం మామ్మా?"

"అదంతా తరవాత చూసుకుందాం. బాబయ్యా, నేను శిఫారసు చేస్తే యిస్తా రని యెవరు చెప్పారూ?"

"ఎప్పుడూ వారి దగ్గిర వుండే గుమస్తా—"

"శ్రీహరీ .........శ్రీహరీ"

"అదేమమ్మా?"

"..................."

"నీవాలకం చూస్తే నాకేమో దిగులు పుడుతోంది, చెప్ప వేమిటమ్మా?"

"తమ రేమీ భయపడవద్దు. నా కివాళ కఠినపరీక్ష కామోసు. లేకపోతే యిది యిలా సంభవించదు. అయితే, బక్కపలాచగా—విషపుచూపులూ—నంగినంగి మాటలూ—ఆఛండాలు డేనా తమకీ సంగతి చెప్పింది?"

"అవును, ఆబోసినోటిపు లే"

"......దేవు డున్నాడా అవధానులుగారూ?"

"అదేం తల్లీ?"

"అదేమంటే? దేవుడు లేడు, దెయ్యాలు మాత్రం వున్నాయి. ధర్మం లేదు, అధర్మం అంతటా నిండిపోయి వుంది. మంచి మంచులో కయినా లేదు, దౌర్జన్యం మాత్రం పెరిగిపోతోంది. నీతి మాలోనే కాదు, మన

దేశంలోనే లేదు. ఎవరేం చెప్పినా శుద్ధ అబద్ధం తప్ప సత్యం లేనే లేదు. ఎటు చూసినా హింస. ఎక్కడ పట్టినా రక్తం. దేవుడు లేనే లేడండీ''

"దేవుడి విషయమై ఇంతగా అపనమ్మకం కలిగించే సంఘటన నీకేమి సంభవించింది తల్లీ?"

"......కోప్పడవద్దు. నన్ను నిందించనూ వద్దు. బ్రాహ్మల్లో కటికిఖండాలులు వున్నా రంటారా? లేరంటారా?''

"లే—ర — ని—చె—ప్ప—లే—ను''

"అయితే, ఆఖండాలులకు తమరు చెప్పిన ప్రెసిడెంటు మొనగాడు. కులపెద్ద"

"..................."

"ఏం, కష్టంగా వుందా తమకి?"

"లేదు లేదు; కాని పాకీవాళ్ల స్వాధీనంలో కూడా కొన్ని పను లున్నాయి"

"నిజమే; కాని పాకీవాళ్లని ఏమీ అనకూడదు. ఏమంటే? పాకీపని వాళ్లకి వృత్తి. వృత్తికీ ప్రవృత్తికీ సంబంధం యేమిటీ?''

"నిజాని కేమీ లేదు''

"కనక, పాకీవాడు పాకీ పని చెయ్యాలి. లేకపోతే

అంతకంటే యెక్కువ యోగ్యత కనపరచాలి "

"అవును"

"మరి బ్రాహ్మడు? "

"దైవికాంశ కనపరచాలి"

"మన ప్రెసిడెంటు దగ్గిర ఆదైవికాంశ దాకా యెం దుకూ, మానవాంశ కూడా లేదు, సరికదా, రాక్షసుల అంశ మాత్రం పూర్తిగా వుంది"

"కొన్ని అవగుణా లున్నా యని విన్నాను. పరమ దుర్మార్గు డని తెలవదు"

"దుర్మార్గుడే కాదు పశువు.........పశువుకంటే అధముడు"

"నీకేమి అపకారం చేశాడు తల్లీ ఆయన? "

"నాకేమీ చెయ్యలేదు అపకారం; తన ఆటవికత మాత్రం బయట పెట్టుకున్నాడు"

"అంటే? "

"నాట్యసంప్రదాయాలను కోయవాళ్ళు కూడా శిరసా వహిస్తారు. మన ప్రెసిడెంటు ఆమాత్రమూ కాలేక పోయాడు"

"బోధపడలేదు"

"నేనొక బ్రాహ్మల యింటో పెళ్లికి మేళం వెళ్లాను"

"సరే".

"మొగపెళ్ళివారికి మన ప్రెసిడెంటు చుట్టం"

"పెళ్ళికి వచ్చా రన్నమాట"

"అవును......ఒక రాత్రి బసకి రమ్మని నాకు కభురు. తమకి నా సంగతి చెప్పిన ఆవూరకుక్కే రాయ బారి"

"తెలవక అడుగుతున్నాను, అమ్మా, నీకూ ఆయనికీ యిదివరకి సంబాధం లేదూ?"

"లేదు. కభుర్లు వచ్చాయి. నే నంగీకరించలేదు".

"అ—లా—గా?"

"మాపింతల్లి కూతురికీ ఆయనకీ సమ్మంధం వుంది దానికీ నాకూ వున్న అనుబంధం పురస్కరించుకుని నేను వల్లకాదన్నాను. ఒకమాటు ఈసంగతి దానితో చెప్పగా, దీనిమీద వాళ్ళిద్దరూ తగువు లాడుకున్నారు. మరో రెండునెల్లకి వాళ్ళకి చెడిపోయింది"

"చాలా గొడవ వుందే?"

"నే నెప్పుడూ, యెక్కడా, యెవరి బసకీ వెళ్ళను. పైగా మేళం వెళ్ళినచోట బ్రహ్మచర్యం ఆచరిస్తాను... ........వల్లకాదని కచ్చితంగా చెప్పేశాను"

"మంచిపని చేశావుతల్లీ"

"నూరు రూపాయల కాగితం మీద పడేశాడు. పుల్లాకుని చూసినట్టు చూసి నేను దూరంగా వెళ్లి పోయాను''

" .........అగ్రజాతుల్లో పుట్టవలసినదాన వమ్మా నువ్వూ"

"అదేనున్నమాట బాబయ్యా? ఇప్పు డగ్రజాతుల విశేషం యేమిటీ? అగ్రజాతుల్లో మాత్రం స్త్రీలకి ఆదర గౌరవా లున్నాయూ? అగ్రజాతుల్లో కూడా స్త్రీ అంటే బానిసే కాదూ? ఆటబొమ్మ కాదూ?"

"..................."

"ఏం, కష్టంగా వుందా బాబయ్యా? అయితే, నేనన్న మాట మరచిపొండి. కరుణించి నన్ను క్షమించండి..."

"అక్కర్లేదు తల్లీ, అక్కర్లేదమ్మా, నువ్వు లోకవృత్తం చెప్పావు. కనక క్షమించనక్కర్లేదు...అయితే, తరవాత యేం జరిగిందీ?"

"ఆవూరకుక్కగా డేం చెప్పాడో, మతిపోయిందో అసలంతేనో, మన్నాడు సాయంత్రం సభలో నేను గజ్జె కట్టివుండగా విప్పించి సత్రకాయచేత కట్టించాడు. రాత్రి వూరేగింపులో నన్ను కట్ట మన్నాడు"

"నీమీాద పగపట్టా డన్నమాట''

"పశుత్వం కాని యిది పగా బాబయ్యా? సభలో నాయకురాలిని గజ్జె విప్పించినవాడూ, వూరేగింపులో నాయకురాలిని గజ్జె కట్టమన్నవాడూ మనిషేనా?"

"ఇప్పటివాళ్ళకి మన విద్యలూ, మన సంప్రదాయాలూ, మన మర్యాదలూ యేం తెలుసును తల్లీ?"

"విద్యలు అక్కర్లేదు కాని ఆవిద్యలు నేర్చిన స్త్రీలు కావాలి. అంచేతే పశువు లనడం.........అదలా వుండనివ్వండి. తరవాత వాకబు చేశాను. మన ప్రెసిడెంటుకి రూపతృష్ణతప్ప మరేమీ లేదు. ఈకుట్ర అంతా ఆ వూరకుక్కది"

"మెహర్బానీకోసమా?"

"కీలుబొమ్మని చేసి చాటునా మాటునా గడ్డి కరవడానికి"

"........................"

"ఎంత కల్పనో యిప్పుడు బోధపడిందా? సాధారణంగా మేము డబ్బు తెచ్చినవాడి నల్లా చేరనిస్తాము. అయితే, వాళ్ళలో రసికులు కాదగ్గవాళ్ళు నూటికొక్కడో యిద్దరో వుంటారు. తతిమ్మా అంతా—"

"బ్రాహ్మణుడు, పెద్దింటివాడు, మన ప్రెసిడెంటే యిలా అయినప్పుడిక తక్కినవాళ్ళ మాటెందుకూ?"

"నేను శిఫారసు చెయ్యడం అంటే యేమిటో తమ కిప్పుడు బోధపడిందా?"

"తెలిసిం దమ్మా"

"నేనంగీకరిస్తా ననుకోండి. అయితే, అబ్బాయిగారికి వుద్యోగం యివ్వడం నిరుకా?"

"అలాగే చెప్పాడు గుమాస్తా"

"అంటే నా ఆత్మద్రోహమూ, మన ప్రెసిడెంటు పశుత్వమూ కలిస్తే వొక బ్రాహ్మణకుటుంబానికి భుక్తి యేర్పరుస్తా యన్నమాట. కదుటండీ?"

"..................."

"కనక బాబయ్యా, ఈరాత్రి ప్రెసిడెంటుని తీసుకు రమ్మని వూరకుక్కతో చెప్పండి"

"అమ్మా—"

"ఒక్క దమ్మిడీ అయినా పుచ్చుకో దనిన్నీ చెప్పండి"

"అమ్మా—"

"కూచోండి బాబయ్యా, అప్పుడే లేస్తా రేం?"

"ఏమీా లేదు. నేను వచ్చినదారినే వెళ్లిపోతాను. నువ్వు ఆత్మద్రోహానికి సిద్ధపడవద్దు"

"అదేమీాం?"

"ఇంత కుట్రా? ఇంత ద్రోహమా? తనెలాగా తార్పు

డుకాడే. నన్ను కూడా తనలాగ తయారుచేస్తాడా యానీ చుడు? నీకూ ప్రెసిడెంటుకీ యిదివరకే సంబంధం వుందనీ, ప్రాధేయపడితే నువ్వు శిఫారసు చేసి పని యిప్పిస్తా వనీ వచ్చాను. పైగా, నువ్వింత యోగ్యురాలవని యెరగనే యెరగను. నేను బ్రాహ్మణ్ణి. వేదం వల్లించాను. యాచన చేస్తూ కుటుంబపోషణ చేసుకుంటున్నాను. ఇక ముందు మరో నలుగుర్ని ఆశ్రయిస్తూ వుంటాను కాని, వేశ్య అయినా కులాంగనలాగ ఆభిజాత్యం కల వొక కళావతిని తార్చడానికి—స్వార్థంకోసం వొక భీతహరిణాన్ని పులి వాత కండ చెయ్యడానికి నేను సాహసించలేను. కనక తల్లీ నన్ను క్షమించు. నాకోరిక మరచిపో. నాకు సెలవియ్యి"

"వల్లకాదు, బాబయ్యా, తమరు వెళ్లడానికి వల్ల కాదు. నామూలంగా వొక వేదమూర్తి కుటుంబానికి జీవనాధారం యేర్పడడం నా అదృష్టం. నాజీవితంలో యిదెంతో పవిత్రమైన సంఘటన. ఇలాంటిది మళ్ళీ లభించదు. ఇంతకీ: నేను పతివ్రత నెలాగా కాను. మగ నాలి నంతకంటే కాను. కనక దీనివల్ల నా కిప్పుడు కొత్తగా సంభవించే పాతిత్యం కూడా యేమీ లేదు. నాకు విచారం లేదు. తమరూ విచారించవద్దు"

"తల్లీ—"

"ఇకనేను వినను. తమ రేమీా సెలవివ్వవద్దు. ఇది యిలా జరిగి. తీరవలసిందే. మనవిచేసుకున్నానుకానూ? పశువులతో సాహచర్యం మాకు పరిపాటే. బాబయ్యా, తమరు బెంగపెట్టుకోవద్దు. ఇందాకా నేను చెప్పినమాట వూరకుక్కతో చెప్పండి"

"నన్ను—"

"మరేమీా చెప్పనివ్వను. మరోలాగ చేశారంటే, నేర్చిన వేదానికి తమరు ద్రోహం చేసినవా రవుతారు"

"నాకంతాని కురి బిగించావమ్మా"

"తమరలా సెలవివ్వవద్దు. ఇక దయచెయ్యండి. ఎప్పుడేనా దర్శనం దయచేయిస్తూ వుండండి. అమ్మగారికి నా దండాలు మనవిచెయ్యండి"

"అమ్మా, నోరు కుట్టేశావు. కాళ్ళూ చేతులూ కట్టేశావు. నన్ను జీవచ్ఛవాన్ని చేసి—"

"అంతమాట అనవద్దు బాబయ్యా"

"ఏం సత్తా తల్లీ నీది? ఎంత యోగ్యురాలవమ్మా నువ్వు? ఏంజన్మ కన్నా నీది? వేశ్యాకులంలో నువ్వు తప్ప పుట్టావమ్మా"

"ఏం, వేశ్యాకులం అంత చెడిపోయిందా బాబయ్యా? అగ్రజాతి గృహిణు లందరూ మచ్చ లేనివా రేనా

నాయనగారూ? మాలో నన్ను తల తన్నే యిల్లాళ్ళు— సాను ఁయి వుండిన్నీ పాతివ్రత్యానికి వరవడి పెట్టేవారు వేలున్నారు. కాని లోకం గుడ్డిది. పురుషులు మత్తులు... ఇప్పు డిదంతా అప్రస్తుత ప్రశంస. దయచెయ్యండి. ఒకట-మాటు పాదాలు........"

"శ్రీకృష్ణార్పణం.........ఎన్ని తిప్పలు పెట్టాడూ నాకు౹ దేవుడు లేడూ? గాయత్రీదేవి యిదంతా చూడ్డం లేదూ? ఈ ద్రోహి — ఈ అప్రాచ్యుడు ముందుకి వస్తాడా?........."

X

"........పద్హాను, పద్ హేడు, పద్ధెనిమిది, పం—ధొమ్మిది, ఇర్వయ్"

"ఏం రెంకువందలూ౹ వున్నాయా?"

"..... ...ఉన్నాయి; కాని కడిగేసినట్టు వెట్టి రూపాయలా తేవడం?"

"......................"

"మర్యాదలు తెలవ్వండీ మీ బ్రాహ్మలికీ. బజారంతా బత్తాయి పళ్ళలా దొర్లిపోతున్నాయికదా, వొక్క వంద పట్టించుకు వస్తేం?.........పోనీ, నాలుగు చెక్రకేళీ

గెలలు, వొక్క డజను ఆపిలుపళ్లు, నాలుగు శేర్ల ద్రాక్ష పళ్లు——"

"తోచింది కాదు. ఆగ్రహపడకండి. మొదటినెల జీతం——"

"సంవత్సరానికి కారువందలండీ. రెండేళ్లకీ పన్నెండు వందలు——"

"ఇంకెందుకూ, తెస్తా నన్నాను కాదూ? "

"అయితే యింకోటికూడా మరిచిపోకండి"

"ఇంకా యేమిటి? "

"ఒక్క పరికిణీగుడ్డ. నాలుగ్గజా లయితే చాలు. గజం రెండూ రెండుంబావులా——రొక్కం నాచేతిలో పడేస్తురూ నేను తంటాలు పడతానూ"

"........................."

"ఏం మాట రాదేం? "

"........................."

"నాకొక్క కూతురండీ లేకలేక నలుగురు కొడుకుల వెనక పుట్టిందండీ! మొన్ననే తొమ్మిదేళ్లు నిండాయండీ! మా అత్తగారి పేరు పెట్టుకున్నామండీ? వెన్నపుంలా పెంచుకుంటున్నామండీ ! అదంటే నాకు ప్రాణమండీ! "

"తెస్తాలెండి"

"రైటో! అదీ మాట. అదీ దర్జా. ఇక వెళ్ళండి. కెల్లవారేటప్పటికి మాయింటికి రండి"

"అలాగే ......... అయితే, రెండుసంవత్సరాలకీ పొక్కమాటే ఆర్డరు పడిపోవాలి సుమండీ"

".........నాలుకా తాటిపట్టా యిది? దీనికి తిరుగుం దనుకున్నారుటండీ?"

"మరి సెలవు"

"సెలవు"

"......... చూడండీ! "మాలపిల్ల" ఫిలింట, వెడదామా?"

"నేను బయలుదేరితే మావాళ్లు కూడా బయలుదేరతారు తెలుసా?"

"అంతట్లో యేం మునిగిపోయింది, జట్కా పంపిస్తాను బయలుదేర తియ్యండీ"

"సెబాస్! మాంచి తెగువకల బ్రాహ్మడవయ్యా! చూడండీ, జిల్లాబోర్డు మనకి స్వార్జితం అనుకోండి. ప్రెసిడెంటు బతుకు మన గుప్పిట్లో వుందనుకోండి. కనక, నన్ను మీరు మరిచిపోకండి, మిమ్మల్ని నేనూ మరిచిపోను"

"సంయే"

"ఈరెండేళ్ళూ అయిపోయాక మిమ్మల్ని వందరూపా

యల గ్రేడుకి లాగేస్తాను చూసుకోండి"

"........గుడ్ బా—య్, గుడ్ బా—య్"

"................"

"........ప్రెసిడెంటుగారు—"

"వస్తున్నారా రమ్మన్నారా?"

"వస్తారుట"

"తీసుకువచ్చి నువ్వావతలికిపో. ముందివిగో యీ...

......అయిదురూపాయలూ రోడ్డు కంట్రాక్టు బాపతు. ఈరెండూ స్కూల్ మాష్టరీల బాపతు. పట్టుకుపో"

"థాంకుస్. థాంకుస్........"

"......................"

"........కంట్రాక్టు ల్లైవరేనా కనపడ్డారా?"

"లేదండి"

"దరఖాస్తుదార్లో?"

"లేదన్నమాటే"

"నుంచున్నపాళంగా డబ్బు కావాలే, మరెలాగా?"

"రేపయితే సప్లయి కావచ్......ఉ"

"రేపటిదాకా ఆగను. అధమం నూరు రూపాయలయినా పట్టుకు వెడితేగాని యివాళ అమ్మాణ్ణి గుమ్మం యెక్కనివ్వదు"

"ఏం, మొగం ముడిచిందా? "

"నిన్న రాత్రి వుత్సాహం అంతా వచ్చిపోయింది"

"అదంతా యివాళ కూడతీస్తాను, అమ్మాణ్ణి మాట మరిచిపోండి"

"అంటే? "

"దానబ్బసాని దగ్గిరికి వెడదాం యివాళ"

"ఏమిటీ? "

"ఇవాళ మీ తపస్సు ఫలించింది."

"ఎవరోయ్? "

"చెబుతా కాదూ "

"రాజామణా? "

"ఛా".

"నీలం——"

"ఛీ"

"వీరభద్రం——"

"ఛేస్"

"మరెవరోయ్? "

"చూస్తారు కాదూ? భోజనం చేసి యిక రెండు గంటల్లో బయలుదేరడమే కాదూ? "

"భోజనమూ వద్దు వల్లకాడూ వద్దు, ఇప్పుడే——"

"........ ........"

"ముక్కుమీద వేలు తీసెయ్, పిలూ డ్రైవర్ని...."

"అలాకాదు—పోనీ చెబుతా కూచోండి"

"త్వొరగా"

"శేషాచలం"

"దుగ్గిరాల—? "

"అవునదే"

"వ్రా—వ్యేస్స్! గుమాస్తా అంటే నువ్వేనోయ్! చక్రవర్తులదగ్గిర ప్రయివేటు శక్రటరీగా—"

"మాటలే కాదూ? వోట్టి షేక్‌హాండులే కాదూ?"

"ఇక అలా కాదు. విసిరికొట్టిన సానిని లాంగతీశావు నువ్వు. ఏంచేసినా నీరుణం తీరదు. నీకేం కావాలో చెప్పు ఈక్షణంలో చేసేస్తాను"

"అయితే, దీనిమీద సంతకం పెట్టండి......"

"ఏమిటిదీ?.........రోడ్డు మెటలింగు కంట్రాక్టా? ఏమయినా రాల్చుకున్నావా?"

"రామరామా! ఆయన మాఅత్తవారి చుట్టమండీ"

"వెంకటయ్య కొండరుకంటే యెక్కువ రేటుదే?"

"దిద్దించేస్తాలెండి"

"గప్‌చిప్! తొరగా అయిపోవాలి......"

" .....దీనిమీద కూడా కాస్త బరికెయ్యండి"

"ఇదేమిటి?"

"హైస్కూల్లో కాళీ."

"రెండున్నాయి కదా?......ఓహో, యాభైరూపా యలదా? ఇందులో నయినా యేమయినా—"

"పరమదరిద్రుడు. పైగా మాఅత్తవారి పురోహితుల వారి ఏకైక అల్లుడు. వద్దువద్దంటూ వుంటే మా అమ్మా యికి దక్షిణాదిపరికిణీగుడ్డ—"

"ఛూ......పోనీ నాకేం?......"

"..................."

"ఇదేమిటి?"

"రెండుమాసాల కాళీ"

"పాతికరూపాయలదా?"

"అవును"

"ఇందులో నయినా—"

"దీనివిషయం శిఫారసు చెయ్యడానికే శేషాచలం—"

"ఆ!"

"అవధానులుగారిని దానిమీదకి వుసికొల్పాను."

"అసాధ్యుడే? దానియెదటే ఆర్డరు వెయ్యకూడదూ?"

"కులాసాగా కాలం గడుపుకోకుండా అంతఃపురంలో

కూడా మీకీ పాడు వ్యవహారా లేమిటండీ?"

"సెబాస్! నీవంటి హంగుదారుమరి లేడోయ్"

"మీరు నన్ను కాస్త కనిపెడుతూ వుంటే నాజీవితం మీకోసం ధారపోసెయ్యనూ?"

"ఇకముందు నువ్వు సంతకం పెట్టమన్నచోట "యేమి" టని అడక్కుండా—చూడకుండా సంతకం పెడతాను, సరా? వీలయినంతవరకూ బోర్డుసాముకూడా—"

"మీపేరుగా వ్రక కొంప—"

"కొంపేమిటి. మళ్ళీ, "మేడ" అను. దానికి పునాది వెయ్యడానికి ప్రధానమంత్రిని లాక్కు వస్తాను చూసుకో"

"అయితే. ఇక నేను పోయి, అంతా సద్దుబాటు చేసి, కాస్తభోంచేసి వస్తాను, యెనిమిదిన్నరకి సిద్ధంగా వుండండి"

"ఆల్ రైట్ మైడియర్ ప్రీమియర్"

౧౯౩౭ ఏప్రిల్

(సవరణలతో)

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

## "రాచపీనుగు తోడు లేకుండా వెళ్లదు"

బ్రాహ్మడు "భవతి భిక్షాం దేహి" అంటూ చెంబు పుచ్చుకుని బయలుదేరా డంటే యెటు చూసినా గౌరవమూ, యెటు చూసినా పూజలూనూ.

స్త్రీలందరూ అతనికి భక్తిప్రపత్తులు నివేదిస్తారు.

తలో పిడికెడూ బియ్యంవేసి "మహాత్మా! పాపులం, వుద్ధరించు" అంటూ శిరస్సులు వంచుతారు.

అతని గొప్పతనం అంగీకరిస్తారు.

ఇక, క్షత్రియుడు "నుంచో" అంటూ కత్తి దూసి వురిమా డంటే, కనుచూపుమేర, వెనకా, ముందూ, పక్కలా హడల్.

స్త్రీపురుషులు ఆబాలగోపాలమూ అతనికి వినయవిధేయతలు కనపరుస్తారు.

"పన్ను" అని పేరుపెట్టి తమ కష్టార్జితంలో కొంత భాగం అతని పాదాల దగ్గిర దాఖలుచేసి "మహాప్రభూ! నీబిడ్డలం, రక్షించు" అంటూ పడిపడిదండాలు పెడతారు.

అతని ప్రభుత్వం అంగీకరిస్తారు.

కాగా, రాగిబుడ్డిచెంబుతో బయలుదేరిన బ్రాహ్మ లలో చివరికి వడ్డీవ్యాపారంలోకి దిగినవా రున్నారు.

ఒక్క కత్తితో మాత్రం బయలుదేరిన క్షత్రియులలో చివరికి మహామహా సామ్రాజ్యాలు నిర్మించుకున్నవా రున్నారు.

ఇంచేత, బ్రాహ్మణవృత్తీ క్షత్రియవృత్తీ—యీ రెండే లోకంలో పెట్టుబడి లేని వృత్తులు.

తక్కిన వృత్తులు ఎంతో కొంత మదు పుంటేనే సాగుతాయి.

అయితే, బ్రాహ్మడూ క్షత్రియుడూ కూడా పుచ్చు కునే వస్తువు రకంలో వొకటే అయినా, ఆయివ్వడం లోనూ, యీపుచ్చుకోడంలోనూ మాత్రం భేదం వుంది.

ఆభేదం కాస్తా కూస్తా కాదు. దోమకీ యేనుక్కీ వున్నంత.

ఇందుకి నిదర్శనంగా, ఆవృత్తికి, మొగంమీద దైన్యం లాస్యం చేస్తూ వుంటుంది.

ఈవృత్తికి, మొగంమీద శౌర్యం తాండవం చేస్తూ వుంటుంది.

కాని దీన్నిబట్టి వీటిలో దేన్నీ కూడా దూషించడానికీ

వల్లకాదు, భూషించడానికీ వల్లకాదు.

ఎందేతనంటే?

సూక్ష్మవిచారణ సాగిస్తే వొకమాటు బ్రాహ్మణవృత్తి గొప్ప దనిపిస్తుంది. మరోమాటు క్షత్రియవృత్తి గొప్ప దనిపిస్తుంది.

ఇంతే కాక: పుట్టింది మొదలు గిట్టేదాకా, పిపీలికాది బ్రహ్మపర్యంతమూ, ప్రతీ ప్రాణి జీవితంలోనూ యీ రెండూ పెనవేసుకునే కనపడతాయి.

ఇవి లేందీ జీవితమే లేదు.

ఈ రెండూ అనాదినుంచీ వున్నాయి. సృష్టి వున్నంత కాలమూ వుంటాయి.

ఇలాగ డబ్బు సంపాదించడంలో దానికి కిందిమెట్టూ, దీనికి పైమెట్టూ మరి లేవు.

అయితే, బ్రాహ్మణవృత్తికి వున్నవూరు విడిచిపెట్ట నక్కరలేదు.

క్షత్రియవృత్తికి వూరే కాదు, వొక్కొక్కప్పుడు దేశమే కాదు, చివరికి ప్రాణాలు కూడా విడిచిపెట్టవలసి వస్తుంది.

## ౨

ఒకమాటు అలాగే తటస్థించింది.

పుట్టిపెరిగినచోట లుగసాను రాగా, ఎంత కష్టపడినా దానికి విరుగుడున్నూ దొరక్కపోగా, డబ్బూ పదవులూ వీలయితే రాజ్యాలూ సంపాదించుకుందా మని కూడ బలుక్కుని, గోత్రాని కొక కుటుంబం చొప్పున అయిదు గోత్రాలకు చెందిన క్షత్రియవీరులు దేశం విడిచి బయలు దేరారు.

దారి పొడూగునా తమవంటివారే కొందరు, కొంత కొంత ప్రదేశం ఆక్రమించుకుని ప్రభువులై క్షాత్రం నెరపుకుంటూ వుండగా వారింకా ముందుకి సాగారు.

రాగా రాగా చివరి కొక తురకరాజ్యం తగిలింది.

అది చాలా విశాల మయింది.

భాగ్యభోగ్యాలతో తులతూగుతూ వుంది.

నవాబు చేతికింద అనేకమంది యోధాగ్రేసరు లున్నా రనీ, రాజ్యవైశాల్యాన్ని పట్టి చూస్తే వారి సంఖ్య చాలా చిన్నదనీ, వీరు డైనవాడు వస్తే పోనివ్వక, అతను, జాగీ రిచ్చి నిలుపుతా డనీ వారికి తెలిసింది.

అక్కడ, తమకి తగిన పదవులు సంపాదించుకోడం

అసాధ్యం కాదనిన్నీ వారికి నమ్మకం కలిగింది.

మకాం వేశారు.

నవాబు చహా రంతా వాకబు చేశారు.

వీరగంధాలు పూసుకుని ఒకనాడు అయిదుగురూ దర్శనానికి బయలుదేరారు.

అసలే క్షత్రియులు.

ఆపైని ఆకొన్న సింహాలు.

ఇక తేజస్సుకి లోటేమిటీ?

అయితే, అలాంటి శౌర్యరాసులు బజారులో కాలి నడకను వెడుతూ వుండడం చూసి, పౌరులు చాలా నొచ్చుకున్నారు.

ఇంతలో దేవిడీ దగ్గరపడింది.

మొదటి ద్వారంలో వారిని చూసినవాళ్లు లేక పోయారు.

రెండో ద్వారంలో పలకరించినవాళ్లు కనపడక పోయారు.

మూడో ద్వారంలో వున్నవాళ్లు "ఎక్కడికీ?" అందామని వూగిసలాడారు; కాని ధైర్యం నిలవకపోయింది.

నాలుగు, అయిదు, ఆరు—యీ ద్వారాల్లో వున్నవాళ్లు ప్రశ్నించారు; గాని వారు చెప్పింది గ్రహించలేకపోవ

డమే కాదు, తా మడిగింది కూడా మరిచిపోయి తెల్ల పోయి నుంచున్నారు.

పోగా, యిక యేడో ద్వారంలో వున్నవాళ్లు అసాధ్యులు. అది దాటితే యిక దర్బారే కనక అక్కడ వున్న వాళ్ళు పిడుగులు.

ఈసంగతి గుర్తించి, క్షత్రియులు, వాళ్ళేమీ అడక్క ముందే తమకి తామే నిలిచిపోయి "నవాబుగారి దర్శనం కావా" లన్నారు.

నిజానికి, కావా లనడం ప్రార్థించడమే.

కాని, ఆ అడగడంలో ధ్వనించిన బింకమూ, ఆ నుంచోడంలో రూపొందిన గాంభీర్యమూ, ఆమొగాలమీద పొటమరించివున్నవీర తేజస్సూ,ఆమీసాల్లో నిలవతొక్కుకునివున్న శౌర్యస్ఫురణా, ఆచూపుల్లో దూసుకుపోతూ వున్న కరుకుతనమూ, ఆచేతుల్లో వుర్రూతలూగుతూ వున్న చంద్రహాసాలూ, ఆనడికట్లలో తొంగిచూస్తూ వున్న కటారులూ, ఆ పరిసరా లన్నీ గుబాళింపచేస్తూ వున్న వీరగంధాలూ చూశాటప్పటికి, వాళ్ళకి, ఆకావా లన్నమాట హుజూరు హుకుం కంటేనూ యెక్కువది అన్నట్టు తోచింది.

వెంటనే వాళ్ళలో వొకడు లోపలికి వెళ్ళి, సెలవు

పొంది వచ్చి, వారిని తీసుకుపోయి నవాబు యెదట హాజరుపెట్టాడు.

## 3

దర్బారంతా నిండి పోయివుంది.

కిటకిటలాడిపోతోంది.

వజీర్లూ, కిల్లేదార్లూ, ఫౌజుదార్లూ, సరదార్లూ, జాగీరుదార్లూ, సౌదాగర్లూ—అంతా యిలాంటి ప్రజ్ఞావంతులే కాని అక్కడ కేవలం మనుష్యు లెవరూ లేరు.

రాచవారిని చూసి వారూ విభ్రాంతు లయినారు.

దర్బారంతా యేదో వొక కొత్త తేజస్సు నిండినట్టు కనబడగా నవాబున్నూ చకితు డైనాడు.

ఒక్క క్షణం గాంభీర్యం విరాజమానం అయింది.

తరవాత నవాబు ఇంగితం కనిపెట్టి, వొకవజీరు అడగ్గా, క్షత్రియుల మొనగాడు అంటుకున్నాడు.

"మేము చాలా దూరంనుంచి వస్తున్నాము"

"..................."

"ఉదారు డైన ప్రభువైనా, శూరు డైన ప్రతిస్పర్థి అయినా దొరక్కపోతాడా అని బయలుదేరాము"

"..................."

"మేము సూర్యవంశక్షత్రియులం"

"........................"

"మాది యోధజాతి"

"........................"

"కత్తిపట్టి, దుష్టశిక్షణా శిష్టరక్షణా చెయ్యడానికే మాజాతి యేర్పడింది"

"........................"

"యుద్ధం చెయ్యడం మాకు విలాసక్రీడ"

వినివిని వజీరు కేసి తిరిగి "యింకా అనేకులకూ అంతే" అన్నాడు నవాబు.

రాచవారి కేసి చూస్తూ వజీరు ఆమాటకి షుకాను వాదం చేశాడు.

దానిమీద "కావచ్చు; కాని ప్రాణాలు పూర్తిగా పోయాకే క్షత్రియుడి చేతిలో వుండిన కత్తి కిందపడి పోతుంది" అన్నాడు మొనగాడు.

"ఇంకా చాలామందికిన్నీ" అంటూ నవాబు వజీరు కేసి చూశాడు. వజీరు రాచవారిని చూస్తూ ఆమాట కూడా అనువదించాడు.

పురపుర చూస్తూ "అలాగేం?" అనుకుని, మొనగాడు "రాచపీనుగు తోడు లేకుండా వెళ్ళదు" అన్నాడు.

"రాచపీనుగు తోడులేకుండా వెళ్లదు"

"అంటే?"

ఒకరికేసి ఒకరు చూసుకుంటూ నవాబూ, నజీరూ ఒక్కమాటే యీమాట అన్నారు.

"అంటేనా? దెబ్బతినిన్నీ యెదటివాణ్ణి చంపిగాని క్షత్రియుడు చావడు"

"చాలా సాహస మైన మాట"

"చూపులకు అలాగే కనపడుతుంది"

"కనపడ్డమే కాదు. అంతే"

"ఎన్నటికీ కాదు"

"కాకేం? ఒక్కొక్కజాతిలో శూరులే చాలామంది పుట్టవచ్చు"

"......................."

"వారిలో చాలామంది అసహాయశూరులే కావచ్చు"

"....... ....... ......"

"ఎదటివాణ్ణి కూల్చినా కూల్చకపోయినా, ఒక్కొక్క శూరుడు, తాను పోరాడుతూనే ప్రాణాలు విడవవచ్చు"

"....... ......... ..."

"అంతే కాని, పోటు తినీ కూడా పొడిచికాని చచ్చిపోడనడం నమ్మరానిమాట"

"తమ కలా తోచడం మా అదృష్టమే. ఏమంటే?

అవునంటే కాదంటూ కూచోడానికి, ప్రత్యక్షవిషయం కాని, యిది, శాస్త్రీయవిషయం కాదు''

"అవును"

"కనక, తిమరు పరీక్ష చేయించవచ్చు"

సభ్యులు వులిక్కిపడ్డారు.

నవాబు "ఎలాగా?'' అన్నట్టు వజీరు కేసి చూశాడు.

వజీరు ఆమాపులు మాటల్లో పెట్టాడు.

దానిమీద రాజుల మొనగాడు మళ్ళీ అందుకున్నాడు.

"మాలో వొకడు, కటారి పిడిమీద చెయ్యి వేసుకుని, తమ సమక్షంలో నుంచుంటాడు''

"... ...... ... ... ..."

"తమ సర్దార్లలో తమ యిష్టంవచ్చినవారిని తుపాకీ యిచ్చి మావాడి యెదట పదిగజాలలో నుంచోపెట్టండి"

"...... ... ........."

"సరదారుచేత తుపాకీ వేయించండి"

"... ... ...... ... ..."

"మావాడు ఆదెబ్బ సంతోషంతో అందుకుంటాడు"

"అదెలాగా తప్పదు''

"తప్పడం యెందుకూ? తప్పితే యిక మాక్షత్రియుల విశిష్టత యేమి కనపడుతుందీ?"

"రాచపీనుగు తోడు లేకుండా వెళ్లదు"

నవాబు నిరుత్తరుడు కాగా, వజీరు మిడుతూ మిడుకూ చూశాడు.

"చిత్తగించారూ?" అంటూ మొనగాడు మళ్ళీ అందుకున్నాడు.

"విశదం నిమిత్తం మళ్ళీ మనవిచేసుకుంటున్నాను. మావాడు ముందు ఆగుండు దెబ్బ తింటాడు"

"తిని!"

"తినీతినడంతోటే ముందు కురుకుతాడు"

"ఉరికి?"

"ఒక్క-యేటున తమ సరదారుని పొడిచేస్తాడు"

నవాబు హృదయం గుబగుబ లాడింది.

సరదార్లు మెరుపుకొట్టినట్టయిపోయారు.

"ముందు మీవాడూ, తరవాతే మావాడూ పడి పోతారు" అన్నాడు మొనగాడు.

సభనిండా సన్నంగానే గుసగుసలు రేగాయి.

వెంటనే "అంటే?" అన్నాడు వజీరు.

"ఇందాకా మనవిచేసుకున్నదే. రాచపీనుగు తోడు లేకుండా వెళ్ళదు" అంటూ మొనగాడు మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

దర్బారంతా మొనట స్తబ్ధమయిపోయింది.

తరవాత అప్పుడే మేలుకున్నట్టయింది.

చివరకి "ఇదేదో చూడవలసిందే" అన్నట్టు కనుబొమ్మ లెగరవేసుకుంది.

ఇలాచూసి అలాచూసి సభ్యులందరూ తనకేసి చూశాటప్పటికి, శౌర్యం వుప్పొంగగా, నవాబు "రేపు జాముపొద్దువేళ పరీక్ష" అని చెప్పి, నాటికి, క్షత్రియులకు సెల విచ్చాడు.

వెంటనే వజీరు, ఆతిథ్యం నెరపడానికి, రాజులవెంట ఓకసరదారుని పంపాడు.

## ౪

ఆరుగురు క్షత్రియులు రాగా దర్బా రంతా విరగబడి పోయింది.

అందులోనూ పచ్చబట్టలు కట్టుకుని వున్న యువకుణ్ణి చూసి వుద్రిక్త మయిపోయింది

ఉభయపక్షాలవారూ "సంయే" అంటే "సంయే" అనుకున్నారు.

మొగాడి పెద్దకొడుకు. ముందు తండ్రికీ తరవాత వరాసగా తక్కిన నలుగురు క్షత్రియులకీ పాదాభివందనాలు చేసి, వారి దీవనలు శిరసావహించి, నవాబుకి

మళ్ళీ సలాములు చేసి కటారిపిడి పట్టుకుని నిర్దిష్టస్థలంలో నుంచోగా, దట్టించిన తుపాకీ పుచ్చుకుని వచ్చి, అతని కభిముఖంగా పదిగజాలలో వొక తురకయోధుడు నుంచున్నాడు.

మేడమీది జనానావారి చూపులికి కిటికీవూచలు కరిగిపోయాయి.

చూసిచూసి నవాబు కన్నుగీటాడు.

తుపాకీ "ఢా" మ్మంది.

ఆఅగావుకి మూతలుపడ్డ దర్బారుకళ్లు మళ్ళీ విడబడేటప్పటికి, దెబ్బతిన్న రాచకుమారుడు, కెవ్వున అరిచి, చర్రున కటారి దూసి, చెంగున ముందు కురికాడు.

కాని,

ఏడుగజాలే వెళ్ళి కుప్పగా కూలిపోయాడు

అందుకే దర్బా రంతా వూగిపోయింది.

నవాబుకూడా "భేష్" అన్నాడు.

కాని మొనగాడిదేమీ గమనించలేదు.

రంగస్థలంలో కొక్కు వుడాం వేశాడు.

"నేను పతితుణ్ణి—తమరు—నన్ను—తాకవద్దు" అంటూ మెడలు వాల్చేసిన కొడుకుకేసి చూడకుండా, అతని చేతిలో వున్న కటారి మాత్రం వూళాక్కుని "మళ్ళీ

యిప్పుడే వస్తాను'' అని నవాబుకి విన్నవించి మెరుపయి పోయాడు.

౫

అక్కడ, బసలో, చూసీచూడ్డంతోటే భర్త వాలకం అంతా గ్రహించేసి, పైట తొలగించుకుని, భార్య, గుండెలిచ్చి యెదట నుంచుంది.

వెంటనే రివ్వున కటారి యెత్తి "నిజం చెప్పు. నీపెద్ద కొడుకి- తండ్రి యెవడూ?'' అంటూ వురిమాడు మొనగాడు.

అది చూసి ఆమె మందహాసం చేసింది.

అబ్బురమా?

రాచకుమాళ్ళకి వుగ్గుపాలతో యిలాంటి వురుములు నేర్పే ఆదిశక్తి ఆమె.

"ముందు పోడిచేసి తరవాతే అడిగినా చెబుతాను కాదూ?" అంటూ ప్రారంభించిందామె.

"ఏం, పెద్దబ్బాయి రసాభాసం చేశాడా?''

"..................''

"అనుకుంటూనే వున్నాను''

"..................''

"అయినా అనుగ్రహం వుంటే వివరాలు చెప్పండి"

మొనగాడికి నరాలన్నీ తోడేసినట్టయిపోయాయి.

"అనుకుంటూనే వుంది" ట.

ఆకళ్ళల్లో యేమి శౌర్యమూ?

అలాంటి తల్లి చేతుల్లో పెరిగినందుకయినా ఆరాచ కుమారుడు తండ్రిమాట నిలిపి వుండవలసింది.

మొనగాడికి కోపం పోలేదు. కాని, వృద్ధవ్రతం అణిగింది.

మొలకట్టులో పెట్టలేదు, కాని, కటారి దింపేశాడు.

చివరికి జరిగిందంతా చెప్పి "యేం చెబుతా" వన్నాడు.

"ఎప్పుడు పుట్టిందో మాతల్లుల కోవ?"

"........................"

"మాతల్లులూ, మా తల్లుల తల్లులూ, వారి తల్లులూ, యింకా వెనకటివారి తల్లులూ యెప్పుడూ, యెక్కడా, యెవరిచేతా వేలుపెట్టి చూపించుకోలేదు"

"........................"

"అయినా, తమకిప్పుడిలాంటి సందేహం కలగడంలో అసంగతం యేమీ లేదు"

"........................"

"చీల్చి చూసుకోండి, దీనివల్ల నాగుండెల్లో కూడా గాయం అయింది"

"..............."

"అయితే, ఇదిలా జరగడానికి పెద్దకారణమే వుంది"

"................."

"నాదగ్గిర పాలు చాలక, పెద్దబ్బాయికి, కొన్నాళ్ళు వెంకటలక్ష్మి పాలు కూడా తగిలాయి"

ఇది విని మొనగాడు పెద్దనిట్టూర్పు విడిచాడు.

దీంతో అతనికి నెమరు తిరిగింది.

చెప్పడాని కేం వుందీ? దాసిపాలు,రాచబిడ్డని, అయిదు గజాలు వెనక్కి లాగేశాయి.

"మొదట పరీక్ష చేసే తీసుకువెళ్ళి వుండవలసింది" అని మనస్సు అనగా "అలాంటివాడు పోవడమే మంచిది" అని బుద్ధి ఝుమాయించి అనేసింది.

"దర్బారులో యేం జరిగిందీ?"

"అబ్బాయి అలా పడ్డాడు, నే నిలా వచ్చాను. అప్పుడక్కడ లేకపోవడమే మంచిది. ఉంటే యేం దుష్టమాట చెవిని పడి వుండునో?"

"నిజమే; కాని యింకా యిలా నుంచుంటే యెలాగా?"

"..................."

"చిన్నబ్బాయిని—"

ఇలా అంటూ తల్లి తనకేసి చూశాటప్పటికి "బాబ

య్యా, నేను వస్తాను పదండి" అంటూ రెండడో కొడుకు ముందుకి వచ్చాడు.

"వెడుతున్నాము. వీలయితే అబ్బాయి కీర్తి తీసుకు వస్తాను. లేకపోతే—లేకపో—తే—" అంటూ మాట తేల్చేశాడు మొనగాడు.

"ఆకటారి యిలా దయచేసి వెళ్ళండి" అంటూ భార్య, పైట సద్దుకుని చెయ్యి చాపింది.

కటారి యివ్వడంలోనూ, పుచ్చుకోడంలోనూ చెయ్యీ చెయ్యీ తగిలాయి.

దాంతో ఉభయవిద్యుత్తులూ కలిసినట్టు, కాగా శౌర్యం ప్రదీప్తం అయింది.

శిరస్సుమీద చేతులుంచి దీవిస్తూ, ఆపుద్రిక్తశౌర్యం అంతా, ఆదంపతులు కొడుక్కి దఖలుపరిచేశారు.

౬

తన పెద్దకొడుకు అలా యెందుకయిపోయాడో ఆకారణం చెప్పి, చిన్నకొడుకుని చూపించి "యిప్పుడు మళ్ళీ తనిఖీ చేయించండి. ఇది చివరిది"అని విన్నవించాడు మొనగాడు.

అది విని దర్బా రంతా నిర్విణ్ణ మయిపోయింది.

"ఇలాంటి అసాధ్యప్రతిజ్ఞ నెరవేర్చుకోడానికి రత్నాల

వంటి కొడుకుల్ని బలిపెట్టుకోడమా?" అన్నాడు నవాబు.

"తమ ప్రీతికి చాలాచాలా నమస్కారాలు. అయితే, నాపెద్దకొడుకు అలా నడిదారిలో పడి వుండగా, తమకు నాకొడుకులు రత్నా లన్నంతమాత్రాన నాకేం తృప్తి?" అని బదు లడిగాడు మొనగాడు.

"బాగా ఆలోచించుకోండి"

"ఒక్కటే ఆలోచన. ఒక్కటే నిశ్చయం"

"..................."

"మేము మానహానికి ఓర్చుకోలేము"

"మరి తమ వంశం మాట?"

"అప్రతిష్ఠాభాజనం అయిపోయాక యిక వంశం వుంటే యేమిటి, లేకపోతే యేమిటి?"

ఈమాటమీద, తక్కిన నలుగురు క్షత్రియులూ ఒక్కొక్కరే లేచి "బతికి వున్నంతకాలమూ మేము ఆదంపతులను పార్వతీపరమేశ్వరులుగా భావించి సేవించుకుంటాము" అని చెప్పారు.

ఇదివిని మొనగాడు సంతృప్తి కనపరిచాడు.

అతని కొడుకు పరమానందభరితు డైనాడు.

అప్పుడు నవాబు దర్బారంతా పరిశీలించాడు.

ఇలాంటి ప్రాణోత్క్రమణాలెన్నో చూసిన కళ్ళవి.

"రాచపీనుగ తోడులేకుండా వెళ్లదు"

పైగా, శౌర్యప్రస్తావన వచ్చినప్పుడు, కొబ్బరిచెట్టు మీదనుంచి పుచ్చె పడడం యెలాంటిదో మనిషి మొెహ మీదినుంచి తలకాయ పడడమూ అలాంటిదే.

దీనికి సాయం, యిప్పుడు మతాంతరుల శౌర్యం పరీక్షించడం.

కాగా, అందరి మొగాలమీదా ఆత్రం కొాణికిపలాడి పోయింది.

అది చూసి నవాబు మళ్ళీ సెలవిచ్చాడు.

వెంటనే తండ్రికీ, తక్కిన కులంవారికీ పాదాభివందనం చేసి, నవాబుకున్నూ సలాము చేసి వెళ్ళి, కటారిపిడి పట్టుకుని రాచకుమారుడు యుక్తస్థలంలో సింహప్పిల్ల లాగ నుంచున్నాడు.

ఈ సందుబాట్లో తుపాకీ దట్టించుకుని వున్న తురక యోధుు, నవాబుకి సలాములుచేసి, దర్జాగా వెళ్ళి, అతని యెదట పదిగజాలలో నుంచున్నాడు.

వెంటనే దర్బారు నిస్తరంగసముద్రం అయిపోయి ది.

సభ్యు లందరూ అనిమిషు లయిపోయారు.

మొగాడు, చూపుతూపులతో పొడిచి కొడుకు శౌర్యం రెచ్చగొట్టి తప్పుకున్నాడు.

నవాబు మళ్ళీ కన్ను గీటాడు.

తుపాకీ మళ్ళీ "ఢాం" మన్నాది.

"ఇతఁడయినా మాట తక్కిస్తాడో లేదో" అని మొన గాడు ఆందోళపడుతూ వుండగా, "ఏమయింది?" అంటూ తురక లందరూ ఆత్రంతో చూడబోయిన్నీ. చిరతలు కమ్మిన కళ్లు స్వాధీనపడక అవస్థపడుతూ వుండగా "హర మహాదేవ" అంటూ వొక సింహనాదం వినిపించింది.

తురకయోధు, రాచకుమారుడు గుండుదెబ్బ తిన డమూ, కటారి దుయ్యడమూ, తనమీదికి వురకడమూ— ఇవేమీ యెరగడు. కెవ్వున కేకమాత్రం వేశాడు:

నిదానించగా తురకయోధూ, రాచకుమారుడూ వొకరిపక్కని వొకరు పడి వున్నారు.

తురకయోధు పేగులు బయటికి వచ్చి వున్నాయి.

రాచకుమారుడి వక్షం తూట్లు తూట్లయిపోయి వుంది.

ఆ ప్రదేశం అంతా రక్తకొల్లయిపోయి వుంది.

కటారి, రక్తం వోడుకుంటూ రాచబిడ్డ చేతిలోనే వుంది; కాని తుపాకి తురకయోధుకి గజందూరంగా పడి వుంది.

దర్బారు తనకళ్లనే నమ్మలేకపోయింది.

తండ్రి మీసంమీద చెయ్యి వేసుకోడం చూసి వొక్క మాటు చిరునవ్వు నవ్వుకుని రాచబిడ్డా, నవాబు తబ్బి

దిగి బయలుదేరడం చూసి వొక్కమాటు మందహాసం చేసుకుని తురకబిడ్డా మెడలు పేలవేసేశారు.

ఏకకాలంలో, వున్న యిద్దరు కొడుకులనూ కోల్పోయిన మొనగాడు, ఆనందతరంగితా లయిన కళ్ళతో దర్బారు కలయచూసి, ముద్దుపెట్టుకోదలిచిన నవాబుకి దర్జాగా చెయ్యి అందించాడు.

*　　　*　　　*　　　*

నవాబు మొదలు పారాజవానుదాకా అక్కడ వున్న వారందరూ పడివున్న తురకబిడ్డనీ, రాచబిడ్డలనూ సలాములు చేసి గౌరవించారు.

నవాబు, తన లీలోద్యానంలో నదరైన స్థలా లిచ్చి,— తురకయోధుని పూడ్చించి అక్కడ చక్కని మహాలు కట్టించాడు.

రాచకుమాళ్ళను దహనసంస్కారం చేయించి ఆ స్థలంలో తులసీబృందావనం వేయించాడు.

తరవాత, అతను, క్షత్రియులకు సైన్యాధిపత్యా లిచ్చాడు. జాగీర్లిచ్చాడు. దర్బారులో మొగుపపీట లిచ్చాడు. కనకాభిషేకాలు చేశాడు.

క్షత్రియులు, నవాబుని దేవుణ్ణికొలిచినట్లు కొలిచారు.

అతని రాజ్యమూ, వైభవమూ, ప్రతిష్ఠా ద్విగుణితం చేశారు.

కొంతకాలానికి మొనగాడు కాలంచేశాడు.

అతని భార్య సహగమనం చేసింది.

అతనివంశం అంతటితో సరి.

పోగా మిగిలివున్న నాలుగుగోత్రాల క్షత్రియులే ఆంధ్రదేశంలో స్థిరపడి వంశాభివృద్ధి పడశారు.

అంచేత ఆంధ్ర క్షత్రియులలో యిప్పుడు నాలుగు గోత్రాలవారే వున్నారు.

జూన్ ౧౯౨౯

(భారతినుంచి సవరణలతో)

# శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్న కథలు

## విమానం యెక్కబోతూ

"వెంకయ్యా!"

దిగాలు పడి పోయినన్నీ దిటవు తెచ్చుకుంటూ—బరువుగా అడుగులు వేస్తూ—అప్పుడే గుమ్మం దాటి వచ్చిన చెలి కాని వెంకయ్యను చూసి, యెదురు చూస్తూనే వున్న మల్లమ్మ, యిలా అంటూ లేచి నుంచుని రెండడుగులు ముందుకి వేసింది.

"ఏమి తల్లీ?"

"ఏమని సెలవు?"

"ఇదిగో కైజారు"

ఇలా అంటూ, అతను, చర్రు మని వొరలోనుంచి కైజారు తీసి పట్టుకుని చెయ్యి చాపాడు. "రాజు గుండెలు తియ్యడాని కేనా?" అంటూ ఆమె అది అందుకుంది.

"అదెలాగ మాతల్లీ?"

"ఎలా గంటే? నేను వెలమబిడ్డను కానుటయ్యా?"

"అది పురుషుల పని తల్లీ"

"వెలమల ఆడవాళ్ళు చేతగాని వాళ్ళా?"

"వెలమస్త్రీలు అసూర్యంపశ్యలు కారు టమ్మా?"

"అంటే?"

"అంటేనా?"

ఉలిక్కి పడ్డాడు వెంకయ్య, ఇది ప్రతిఘటనం అన్నట్టు కూడా తోచిం దతనికి. "ఇదేమిటి చెల్లెమ్మా యివాళ కొత్తమాటలు మాట్లాడుతున్నావూ? ఇది నీకు తెల వందా? నేను చెప్పాలా?"

"ఇప్పుడు మీ అర్థం యేమిటో అని_"

"ఇప్పు డేమి టప్పు డేమిటి, యెప్పుడూ వొక్కటే అర్థం, మీరు బయటికి రాకూడదను"

"మంచి అర్థమే. ఏం, బయటికి వస్తే?"

"తమ స్త్రీలు పరపురుషుల కంట పడ్డ తరవాత, యిక వెలమలకు మర్యాద యెక్కడి దమ్మా?"

"ఎంత పాపిష్ఠి బతుకయ్యా మాదీ? మాలమాదిగల దగ్గిర్నుంచి బ్రాహ్మలదాకా అన్ని వర్ణాల స్త్రీలూ అవసరం వచ్చినప్పుడు బయటికి వస్తూవుంటే, వారికి లేని మానభంగం మాకెలా వస్తుందయ్యా?"

"మొదణ్ణుంచీ అది మన ఆచారం కాదు టమ్మా?"

"స్థితి విషమించినప్పుడు కూడా అంతేనా?"

"తెగించినవాళ్ళకి విషయించడం యేమిటి తల్లీ ?"

"అదీ మాట. మరి మేము తెగించవద్దూ?"

"అవశ్యమూనూ"

"ఎందుకో?"

"ప్రభువు ఆజ్ఞ నెరవేర్చడానికి"

"గొంతుకు పిసుక్కోడాని కన్నమాం...అవునా?"

ఈమాటలో శౌర్యం తలముసక లయింది.

అతను మొగం వంచుకున్నాడు.

"అంతేనా?"

మొగం పైకెత్తాడు; గాని పక్కకి తిప్పుకున్నాడు.

"మాట్టాడ వేమయ్యా?"

"ఏమి చెప్పను తల్లీ?"

"ఏమి చెబుతావూ? ఏమి చెప్పగలవూ?......ఎంత కర్మమయ్యా? శత్రువు వచ్చి పీకమీద కూచున్నప్పుడయినా—మొగవాళ్ళకి తలవాటి వచ్చినప్పుడయినా—"

"వెలమవీరులకు తలదాటి రావడం యేమిటమ్మా?"

ఈమాట అనేటప్పు డతని చూపులు చెరకాకు బల్లే లయిపోయాయి.

"ఏమిటీ?......మళ్ళీ అను ఆమాట"

"ఏం అనకా ?"

"అయితే, యిప్పుడు నీ రాకకు కారణం?"

"అది దొరవారి ఆజ్ఞ"

"అదే నయ్యా! పోనీ, దాని క్కారణం?"

"మానభంగ భయం—"

"ఏమిటీ?......ఎవరికీ? బొబ్బిలి వెలమస్త్రీలకే?"

మల్లమ్మ యిలా వురిమింది. గతుక్కు మన్నాడతను.

"మేము యుద్ధరంగంలోకి వెడితే పగవాళ్ళింతకంటే కఠినంగా మాట్లాడతారా?"

"తర్వాని కిది సమయమా అమ్మా?"

"అది నే నడుగుతున్న మాట. వెలమస్త్రీలు బయటికి రాకూడ దన్నది సామాన్యధర్మం. స్థితి విషమించినప్పు డెందుకు రాకూడదూ?"

"వెలమలు ఇదివరలో చేసిన యుద్ధాల్లో ఎప్పు డయినా స్త్రీలు కత్తిపట్టడం—"

"శత్రువు దుష్ప్రయత్నాలు ఫలించడానికి సిద్ధంగా వుండడమూ—పైవారు కోట విడిచి పొమ్మనడమూ—"

"ఒకదాని కొకటి యెప్పు డేనా పోలిక వుంటుందా?"

"మరి యీ కెందుకా మాటా? అప్పటప్పటి వెలమస్త్రీలు యుద్ధరంగాల కెందుకు వెళ్ళలేదో మన కేం తెలుసూ?"

అతనికి జవాబు తోచలేదు.

"కాకపోయినా, ఇప్పుడు మనకి వచ్చిన అవస్థల వంటివే వారికీ వచ్చా యనీ, అయినా అప్పటి వెలమస్త్రీలు యుద్ధ రంగాలలోకి వెళ్ళక అంతఃపురాల్లోనే పొడుచుకునో, కాల్చుకునో బుగ్గి అయిపోయా రనీ నిదర్శనా లేవీ? అదీ గాక: వారు వీరమాత లయి వుండవచ్చు. వీరపత్నులు న్నూ అయి వుండవచ్చు. తాము 'వీరాంగనలే' అని అని పించుకోడానికి వారు ముచ్చటపడివుండకపోవచ్చు. ఇప్పుడు మే మలా కాదు. కోటలో వున్న వెలమస్త్రీ లందరూ "మన మైనా విజయరాముణ్ణి పొడిచెయ్యవద్దా?" అంటు న్నారు. మా శౌర్యం అంతా యేమి కానూ? కత్తి పట్టా లని నాకు సరదా పుట్టింది. నేను వీరమాత నవుదునో కానో తెలుసుకోవా లంటే నా బిడ్డ పాలబుగ్గలవా డయి పోయె. ఇక నే నేం చెయ్యాలీ? చిన్నతనంలోనే "మల్లమ్మ యెన్నిక అయిన" దని పేరు తెచ్చుకున్నాను. నీ ప్రభువుకి తగిన రాణి ననిపించుకున్నాను.మరి యిక "విజయరాముడి పాలిటి మహిషాసురమర్దని"ననిపించుకో వద్దు టయ్యా?"

ఈమాటలలో వెంకయ్య చెవులు గళ్ళుపడ్డ ట్టయి పోయాయి.

"ఏ మంటావు వెంకయ్యా? "

ఏదో అనబోయాడు కాని మాట రా లేదు.

"వెలమల ప్రయత్నాలు వ్యర్థం అయినప్పుడు—వెలమ దొరల శౌర్యం నిస్తేజం అయిపోయినప్పుడు—"

"ఏ మన్నావు తల్లీ? "

ఇలా అంటూ అతను వుద్రిక్తుడైనాడు. ఈమాటలో అతని శౌర్యం అంతా మూర్తీభవించింది.

"ఉలిక్కిపడకు. నువ్విప్పు డేమి చెయ్యడానికి వచ్చావో తెలుసుకు మరీ మాట్లాడు......చూడూ. బొబ్బిలి వెలమవీరుల ప్రతాపం మొక్కపోయినప్పుడు—"

"వినలేను, అమ్మా! సహించలేను. నువ్వీక యీ ధోరణి మార్చకపోతే నారక్తం వుడికెత్తిపోయి—"

అతని చెయ్యి గభీమని కైజారుమీదకి పోయింది.

"ఇంకా యెప్పుడో వుడుకెత్తుతుంది. ఇప్పటికి మంచు గడ్డలాగే వుంది, కదూ? "

"హరహరా! మహాదేవ! చెల్లెమ్మా! "

ఇలా అంటూ, పళ్ళు పటపట కొరుకుతూ, కైజారు దూస్తూ, నిప్పులు కక్కుతూ పైకి చూశాడు. వీరావేశంతో అతని శరీరం ఆపాదమస్తకమూ మెరుపుతీగ అయిపోయింది; కాని ఆచూపులకు "నే నేం చెప్పాను? నువ్వేం చేస్తున్నావు? " అంటూ కసురుతున్నట్టు రంగారావు ఉగ్రముఖం కనపడింది,

వెంటనే గభీమని ఆ వుద్రేకం అడ్డుపడిపోయింది. మొగం వాలిపోయింది. దంతఘర్షణం క్రమాంతరువులలో తగ్గుతుండగా, "తల్లీ...తల్లీ...తల్లీ..." అని ఆగి ఆగి పలుకుతూ అత నది నిట్టూర్పులుగా మార్చేశాడు.

చెయ్యి, తోటకూర కాడలాగ వేలాడిపోయింది.

ఈబుస్సలూ, యీచల్లబడిపోవడమూ మల్లమ్మకు ఏవ పుట్టించాయి.

"బీరాలకా విరోధులు లొంగుతారు? ఒక్క రోజుకే నిరాశ చేసుకోవలసివచ్చినప్పుడు వెలమల కింకా మర్యాద అంటే యేమిటయ్యా? నిజంగా, ఇప్పుడు, బొబ్బిలి వెలమల రక్తం వుడుకెత్తే స్థితిలోనే వుంటే శత్రు వింకా అలా కులుకుతూ వుంటాడా? ఏమి దుష్కాలం వచ్చిపడింది?"

"కాలం దుష్ట మయిపోయింది కనకనే ప్రభువు ఆజ్ఞ యిలా వుంది."

"తప్పు, తప్పు. కాలం దుష్ట మయిపోయింది కనకనే స్త్రీలు కూడా కత్తి పట్టాలి. వీరాధివీరు డయ్యుండిన్నీ బొబ్బిలిమీదికి రాజు సొంతంగా రాలేకపోయాడు. వజ్రాలవంటి మహాయోధులు పదుగు రుండినా అతగాడు తురకల సాయం పుచ్చుకున్నాడు. దాని ఆంతర్యం మీ రేమయినా గ్రహించగలిగారా? ఇలాంటి స్థితిలో స్త్రీల

సాయం పుచ్చుకోడం వెలమలకు లజ్జాకారణం కాదని వూహించలేరా వెలమలు?"

అత నేదో అనబోయాడు; గాని అంతలో,—

"పైగా, పురుషులు స్త్రీలను కోరడం కా దిది. స్త్రీలే వురుకుతా మనడం. భేదం యే మయినా తెలిసిందా?

"ఫలితం—"

"ఫలితమా? వెర్రివాడా? రాజు బొబ్బిలిమీదికి స్వంతంగా రాలేకపోయా డంటే అది అతనికి స్త్రీత్వం కాదుటయ్యా? అలాంటి శత్రువును బొబ్బిలి వెలమదొరసానులే పరిమార్చిస్తే ఫలితం యెంత చక్కగా వుంటుందో వూహించుకోలేవు టయ్యా? "

"తల్లీ—"

"ఇలా చూడు నాయనా! శ్రీరాజా రావు రంగారావు దొరవారికి నేను ధర్మపత్నినే. మరి వారికి సహధర్మచారి ణ్ణని కూడా అనిపించుకోవద్దు టయ్యా? "

"కాక యిప్పుడేమి లోటు వచ్చిందమ్మా? "

"ఏమి మిగిలింది తండ్రీ? "బొబ్బిలి రాణికి మూడూళ్ళు ముండభరణం యిస్తా" నన్న రాజు బతికేవుండగా, బొబ్బిలి రాణి ఆత్మహత్య చేసుకోవడమా? ఇది నాకు మానభంగం కాదూ? "

"కుండభరణం" అనే మాట అతనికి చురుక్కుమని పించింది. "అలా అంటాడా?" అని రాజుమీదా, "అలా కఘరంపడం యేమిటి?" అని మల్లమ్మమీదా అతనికి చాలా కోపం వచ్చింది. అయితే, అవి ప్రారంభంలోనే మిళిత మయిపోయి యేకధారగా రావడంవల్ల యిక్కడ ప్రకటించడానికి వీలు లేక—గుండెలు తాళక లోపల్లో పలే అణిచేసుకున్నాడు. ఈ ప్రయత్నంలో వుండడంవల్ల అతను మరి జవాబయినా చెప్పలేకపోయాడు.

"మీ ప్రభు వెక్కడయ్యా?"

"మొగసాలలో—వెలమలమధ్య—సర్వసన్నద్ధులై—"

"వెళ్ళి యీ సంగతి చెప్పి రా"

"ఆజ్ఞ లేదు తల్లీ!"

"పోనీ, నేనే వెడతాను. నా కడ్డేమిటీ?"

"నీ కడ్డేమి టమ్మా? నిన్నడ్డుకోడాని కెవడికి గుండె లున్నాయి తల్లీ? అయితే,—ముందిక్కడ పొడిచి—"

ఇలా అంటూ అతను, తర్జనితో నిర్దేశిస్తూ యెగు రొమ్ము విరుచుకు నుంచున్నాడు.

"ఏమి మాట అన్నావూ? అదా మల్లమ్మ చేసే పని? ఎంత చక్కగా వూహించావూ? నేను కైజారు దుయ్యడమే వస్తే అది రాజు పేగులు బయటికి తియ్యాలి. స్వజనం

మీాద టయ్యా నా ప్రతాపం?''

ఈమాట శూలమై అతని గుండె దూసుకుపోయింది. దాంతో మాట నిలిచిపోయింది.

"మల్లమ్మ అంటే నీకు పౌ—త్రి స్వపక్షపరపక్షనిర్ధా మధామురా లని తోచిందా నాయనా?''

పక్కవాటుగా వున్న మొగం ఆమెకేసి తిప్పుకున్నాడు; కాని చూపులు మాత్రం తివాసీమీాదే వున్నాయి.

"అయితే, వెంకయ్యా! నా కిక నాదేవుడి దర్శనం లేదు టయ్యా?''

అప్పటికి గుక్క తిప్పుకోగలిగాడు. అయ్యవార్లంగారు నూరిపోసిన పురాణసారం అంతా గభీ మని నెమరుకి వచ్చింది. దాంతో "ఈక్షుద్రమానవకళేబరం విడిచిపెట్టే సిన తరవాత అది శాశ్వతబ్రహ్మకల్పమే కాదు టమ్మా నీకు?" అంటూ మొండిగా బదులు చెప్పాడు.

"మెట్టవేదాంతంచాలించు. ఈమానవకళేబరంవున్నంత సేపే—మానవకళేబరానికే పగ అయినా, కసి అయినా''

"ఈకళేబరం శాశ్వతమా?''

"నీ వెలమతనం మాత్రం శాశ్వతమా?"

అతను మళ్ళీ మొగం వంచుకున్నాడు.

"బొబ్బిలి కొట్టడానికి వచ్చిన రాజుకి మాత్రం తన

కళేబరం శాశ్వతం కా దని తెలవదూ?''

"ఈబొబ్బిలి పాటిమీా దే అది వారక్క-పో తే కదా?"

"ఆపనే కాదూ నేను చేస్తా నంటున్నదీ?"

యుక్తి తోచక, అతను "వాగ్వాదం చాలించవు తల్లీ?''

అని లాలనగా అడిగాడు.

"బొబ్బిలి వేరి కోమటి రమణులు గోల్కొండసర దార్లను తూనికరాళ్ళతో చీకాకుపరిచారుట. బొబ్బిలి పాటకపు స్త్రీలు విజయనగరం సరదార్లను రోకళ్ళతో కుమ్మారు ట. బొబ్బిలి వెలమదొరసాను లామాత్రం అయినా కారు టయ్యా?''

"ప్రభువు నాకోసం కనిపెట్టుకుని వుంటా రమ్మా?"

"నువ్వు కూడా వుంటే కాని వారు రాజుమీాదికి వెళ్ళరూ? తోడబుట్టువులనూ, తల్లులనూ, పిల్లలనూ పొడిస్తే గాని నీకు పౌరుషం రేకత్తదు కాబోలునేం?"

పేగులు తోడేసిన ట్టయిపోయి, అతను నిట్టూర్పు విడుస్తూ కళ్ళు మూసుకున్నాడు.

"ఎంత పాపం బద్దలాసిపోయిం దయ్యా! సత్యభామ కాసె బిగించి విల్లు వంచి నరకాసురుణ్ణి గజగజ లాడించి వేసింది. ఓరుగంటిలో రుద్రమ్మా పల్నాటిలో నాగమ్మా కత్తి విసరగా పరసేనలు చెల్లాచెద రయిపోయాయి. మరి

బొబ్బిలిగడ్డమీద, మల్లమ్మ కై జారు దూస్తే రాజేమయి పోతాడో లోకానికి తెలవవద్దు టయ్యా?"

"ఊహలతో యేమి లాభం తల్లీ?"

విసిగిపోయి అతనిలా అనేటప్పటికి, తోకతొక్కినతాచు లాగ, ఆమె "ఊహలా? ...ఏమిటీ?" అని కస్సు మంది.

"జరుగుతుందో జరగదో—"

"ఇంకా అదే మాటా? వెలమవీరుడి నోట రావలసిం దేనా యీ మాట?"

"....................."

"నేటికి బొబ్బిలిగడ్డ విరిగిపోయిందా?"

"................."

"తాండ్ర పాపారాయణిం గా రుంటే—"

"పాపారాయణింగారి కీవార్త అయినా తెలిసిందో లేదో? అక్కడ రాజాము కోటగతి యేస్థితిలోవున్నదో?"

"నిజమే. పాపారాయణింగారి కీవార్త అయినా తెలిసిందో లేదో? రాజాముకోట సంగతి అలావుంచు. బొబ్బిలికోట మాట యేమిటీ? ఇక దీనికి నీళ్లు వదులుకోవలసిందేనా?"

"...................."

"పాపారాయణింగారు లేరు. తక్కినవా రంతా?

బీరాలు పలికిన వెంగళరాయణింగా రేం చేస్తున్నారయ్యా? చెలికాని వేంకటరాయణింగారి సంగతి కనపడుతూనే వున్నది మరి రావు చిన్నారాయణింగారు, దామెర ధర్మా రాయణింగారు, ఇనగంటి సరసారాయణింగారు, కాకర్ల పూడి వెంకటరామరాజుగారు, పంతెన బుచ్చన్న గారు— ఏరయ్యా వీ రంతానూ? ఏం చేస్తున్నా రయ్యా? రాజు దుర్మణవార్త నా చెవిని వెయ్యగల మొగవాడు బొబ్బిలి పాటిమీద లేడు టయ్యా?"

"......................"

"మాట్టాడవు...అయినా, ఏమని మాట్టాడతావూ? కత్తి ఝుళిపిస్తూ జనానాలోకి వచ్చావు. మహాగొప్ప పని దొరికింది నీకు; కాని, నాయనా! బొబ్బిలి వెలమదొర సానులకు, పగవాళ్ళని పొడిచెయ్యడానికి లేకపోతేమానె, సొంతంగా పొడుచుకోడానికయినాఅవకాశంవుండనియ్యి"

"......................"

"నూరు కుటుంబాల వెలమస్త్రీలు. చికిలీచేసిన చంద్ర హాసాలు. కష్టసమయంలో వుపకరించవలసిన యెంత శక్తి అడవిగాసిన వెన్నెల అయిపోతున్నదీ? బొబ్బిలి కిలాంటి పాట్లు వచ్చినందుకు వా రెంత కుమిలిపోతున్నారో, శత్రువులను చీల్చి చెండాడా లని యెంత తహతహ లాడి

పోతున్నారో యెవరు చూశారూ? వెంకయ్యా, ఇష్టం లేకపోతే జయించినా మేము బతక మయ్యా! చచ్చి పోడాని కయినా యుద్ధంలో వురకడాని కనుజ్ఞ యిమ్మని అడగవయ్యా దొరగారిని"

"నీకు పది జవాబు లెందుకు తల్లీ? మాకు అక్కడ రంగారాయణింగా రెంతో యిక్కడ మల్లమ్మ అంత"

"అయితే, యుద్ధంలోకి వెడదాం పద"

"అది రాజాజ్ఞకి వ్యతిరేకం తల్లీ"

"ఇంకెందుకూ మరి పోగడడం?"

"నేను రావువారి సేవకుణ్ణి. దొరవారి ఆజ్ఞ యిలా వున్నది. జవదాటడానికి నే నెంత—"

"అది దొరవారి ఆజ్ఞ అయితే, యిది దొరసానిగారి ఆజ్ఞ, వెళ్లి మీదొరగారి నిలా తీసుకురా"

"పని కాకుండా కళ్ళబడడానికి ఆజ్ఞలేదు తల్లీ"

"అంతే? ......ఎంత చెప్పినా ఆమాటే? మనం పోయినా లోకం వుంటుంది. బొబ్బిలి వెలమలు, అమానుషచర్యలు నడిపిన రాజుని పొడిచెయ్యలేకపోయా రనీ, ఆపని చెయ్యడానికి స్త్రీలు సిద్ధపడగా అడ్డుకున్నారనీ—"

"................."

"వెంకయ్యా!"

## వీమానం యెక్కబోతూనూ

"అమ్మా !"

"ఏ మంటావు?"

"ఆలస్యం అయిపోతున్న దంటాను. దీనివల్ల యేమీ ప్రయోజనంలే దంటాను"

"అంటావు......అనవూ మరీ? ద్వారకి తగిన జెట్టివి. ఈ విషయంలో అయినా యింత స్థిరంగా వుండగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను. నాయనా! ఆలస్యం అయిపోతున్నది—అయేపోయింది కాదూ? ఏమంటే యేం చెబుతా వక్కడ? పగవాడి గుండెలు తియ్యవలసిన కైజారు చేసుకున్న పెళ్ళాం మీదికి తిప్పారా అని అడిగిందని చెప్పేం? "శత్రువుల చేజిక్కి మేము మానభంగం పొందకుండా యిలా ముందు జాగ్రత్త వహిస్తున్నట్టే, యీస్థితి సంభవించకుండా వుంటేటట్టు పైనుంచి తాఖీదు వచ్చినప్పణ్ణుంచీ జాగ్రత్తపడితే యెంత బాగుండిపోవునూ?" అని అడిగిందని కూడా చెప్పేం?"

"..................."

"పట్టుమంటే గుప్పెడుండదు ప్రాణం. దానికోసం కాదు సుమా యీ రాద్ధాంతసిద్ధాంతాలు. కన్ను మూసి తెరిచే టప్పటికీ లోకం యెక్కడో యీజీవు డెక్కడో? ఇదివర కిలాంటి తనువు లెన్నయినాయో? ఎన్ని అనుభ

వాలు సంభవించాయో? ఇకముం దెన్ని కనిపెట్టుకున్నాయో? కాని యింతకంటే నికృష్టత మరి వుండదు. ఇంతకంటే దౌర్భాగ్యం మరితటస్థించదు. పగవాడు కానిమాటలాడడమూ, మొగవాడు కాని చేత చెయ్యడమూనూ. శరీరం వుడికిపోతున్నదయ్యా! ఇంతకంటే చిత్రవధ మేలు సుమా''

అతనికి చెయ్యి పెట్టి కడుపు కలిచేసినట్టయింది.

"ఆత్మహత్య మహాపాతకం అన్నారు పెద్దలు. కాని బొబ్బిలి రాణికి అదే సంభవించింది. పొడిచి పొడిచేసుకుంటే యీతహతహ లేకపోవును. బొబ్బిలి కొట్టాలని యెక్కడ సంకల్పం కలిగిందో ఆ రాజు గుండెలమీద కసుక్కున వ్రెక్కపోటు పొడిస్తే తరవాత యేమయిపోయినా యీ ఆరాటం లేకపోవునయ్యా"

"................."

"ఇప్పుడే మనుకుంటే యేమి లాభమూ? నిన్ను మాత్రం యెన్నంటే యేమి ప్రయోజనమూ? రంగారాయణింగారంతటి వీరాధివీరుడి యిల్లాలికే యిలాంటి గతి తప్పనప్పుడిక యితర్ల మాట చెప్పే దేమి వున్నదీ? బతికుంటే బొబ్బిలిరాణికి భరణమే యిస్తాడు విజయరాముడు—''

"అమ్మా!"

"ఏమి నాయనా! నీ వీరవిహారానికి మల్లమ్మ అడ్డు వచ్చిందా? ఇదిగో పంపేస్తున్నాను. ఇంతసేపు వాగాను. వాగడం వొక్కటే కనపడుతున్నది; కాని మరేమీ లేదు. నిజమే. పగతీరకుండా చచ్చిపోయాటప్పు డిక యెవరి నేమంటే యేమి వస్తుందీ? అక్కస్సు పట్టలేక యేమి టేమిటో అన్నాను. క్షమించాలి సుమా అన్నయ్యా! మల్లమ్మ మంచీ చెడ్డా చెప్పేదే కాని, చివరికి, ఆజ్ఞ జవ దాటేది కాదని చెప్పి, తప్పులు మరిచిపొమ్మన్నా నని ప్రార్థించినట్టుకూడా మీ బావగారితో చెప్పాలి సుమా అన్నయ్యా!"

"........................"

"శ్రీమన్నారాయణమూర్తీ! సూర్యచంద్రుల్లారా! ఇదే నా కడపటి పూజ. ఇదే నా కడపటి నమస్కారం. ఇదే నాకడసారపు ప్రార్థన. పాలబుగ్గలవాడయిన నాబిడ్డని చల్లగా చూడండి. నా ఆయు వంతా అతనికి పొయ్యండి. బొబ్బిలి రావువారి రాజవంశం అతని పేరుగా నిలపండి. అకాలమరణం పొందుతున్న యీ వెలమవీరుల శేష శౌర్యం అంతా అతనికి దఖలుపరచండి. నాభర్తగారు చెయ్యవలసిన పని అతనిచేత చేయించండి. అదే నాకు

పదివేలు. అదే నాకు వరప్రసాదం. అప్పుడే నాయాతన తీరుతుంది.........కైజారు పదునుగానే వుంది. లేకపోయినా సాహసం వుంటే తడిపాతే చాలుతుం దెంతకైనా. శ్రీహరీ! శ్రీహరీ! శ్రీ...హ.. ర్...ఈ..."

ఒక్కటే పోటూ, ఒక్కటే పాటూను.

వెంకయ్య కళ్ళు చిరతలు కమ్మాయి. చివరి కతని కళ్ళకి అంతా శూన్యంగా కనపడింది. క్షణంలో అతని చేతులు రాణివాసం శూన్యం చేసేశాయి.

౧౯౨౬ ఫిబ్రవరి

(భారతినుంచి సవరణలతో)



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B187 |
| పుస్తకం పేరు | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథలు |
| తారీఖు | [illegible]/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, [illegible], BC1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |